# పాకీస్థానపథకానికి రష్యా ఆమోదమా!

## ప్రముఖసిక్కు-నాయకుని ప్రవచనము

ఈమధ్య ముఖ్య సిక్కు-నాయకుడు సర్దార్ శార్దూలసింగు కవిశీరుగారు పాకీస్థానపథకము గూర్చి గావించినప్రకటనలను నాగపూర్ పత్రిక "యిండిపెండెంటు" ప్రకటించియుండెను. వాటిలో సర్దారుగారు, పాకీస్థానమునకు బ్రిటిషుసామ్రాజ్యవాదుల ప్రోత్సాహప్రోద్బలమే కాకుండా కొంతమంది రష్యాప్రాబల్యములోవున్న ముసల్మానుల ప్రోత్సాహమున్నదని ప్రకటించిరి.

అంతేగాక కొంతమంది ముసల్మానులు ఉత్తరహిందూస్థానమును అఖిలభారతమునుండి విడదీసిన ఆప్రాంతమును రష్యాప్రాబల్యముక్రింద కి తీసుకొనివచ్చుట సులభమనియు, దీనికిపరిషియా ఆఫ్గనిస్థానములుకూడ చాలతోడ్పడగలవని విశ్వసించుచున్నారు.

సర్వమహమ్మదీయరాజ్య సమ్మేళనోద్యమము పెంట్టబెండట తుర్కీలో ప్రారంభించబడెను. కాని అదియిప్పుడు స్వతంత్రమహమ్మదీయ రాజ్యములలోనశించినప్పటికి యింకా హిందూదేశముసల్మానులకు అఉద్యమమునందు మోహముతగ్గలేదు. ఈక్రిందవ్రాయబడినలేఖ రష్యాప్రాముఖ్యములోవున్న ఒకప్రముఖముస్లిం. ఒక ముస్లింలీగునాయకునికి వ్రాసినది. దీనినిబట్టి పాకిస్థానముగురించినవిషయము బాగా బోధపడగలదు"

(లేఖ ఉర్దూనుండిఅనువాదము)

"ప్రస్తుతమున్న ప్రపంచపరిస్థితులవల్ల బ్రిటిష్వారికి హిందూదేశవ్యవహారములపై దృష్టివుంచుటకవకాశములేకున్నది, వారు సామ్యదండయాత్రి అను ఎదుర్కొనవలసియున్నది, స్వదేశప్రజలవిషయమైచూచుకుంటూ అమెరికాను ఈయుద్ధమునకు సహాయముచేయుటకు ప్రోత్సహించవలసియున్నది. బ్రిటిష్వారికి ననుగుణ్యంగా పరిస్థితులెట్లుండునో తెలియకున్నది. ఒకవైపునజపాను యిటలీజర్మనీలమధ్య సమాఖ్యజరిగేసూచనలు గనిపించుచున్నవి.

అట్టిసమాఖ్యఫలితములను మీరు గమనించారా? అమెరికాజపానులమధ్య పెరుపులుపుట్టును భగవంతుడు యిట్టివిజరుగనీయకుండునుగాక, కేవలం దుకు యిదిరోటిభవిష్యత్తులోజరుగనున్న సంఘటనలనుగూర్చి ఆలోచించితేమీకే తెలుస్తుంది.

ప్రస్తుతము రష్యాతటస్థంగావుంటున్నా అది తప్పక యుద్ధములోదిగకతప్పదు. అపుడుపార్టీలు యిట్లావుంటాయి.

బ్రిటను, దానిసామ్రాజ్యము అమెరికా ఒకవైపు రష్యాజర్మనీ యిటలీజపానులు మరొకవైపు.

దీనినిబట్టి నాఉద్దేశ్యము బర్మా, బెంగాలు, బీహారురాష్ట్రాలుజపానుకు, యివ్వబడుతాయి. సి-పి-యు-పి-లలో మాత్రం మెజారిటీకులంవారి ప్రాబల్యంఉంటుందికాబట్టి ఆదాయమునుండి ఖర్చులుపోగా మిగిలినదానిని యిట్టిసమాఖ్యలో చేరినవారందరికి సమానంగాపంచబడును. బొంబాయిమద్రాసురాష్ట్రములు యిటలీకి, యు.పి.లోని పశ్చిమప్రాంతము (రోహిల్ఖండ్, మీరటులతోచేరి) పంజాబు, సరిహద్దు. సింధురాష్ట్రములు రష్యాకుయివ్వబడుతాయి, అప్పుడుఅఫ్గనిస్థానమునకుప్రాముఖ్యమువుండదు. కారణము చుట్టూవున్న ముస్లింరాజ్యాలప్రాబల్యమువల్ల అదికూడా రష్యాకులొంగకతప్పదు.

అవిధంగా సంయుక్తరాష్ట్రింతో ప్రారంభమై టర్కీవరకువ్యాపించు ఒక ముస్లింఆక్షరాజ్యాన్ని స్థాపించవచ్చు జనాభాలో ౨/3 వంతు మహమ్మదీయులుగల రష్యాముసల్మానులపైకోరికను నిరాకరించదు,

యిదిబహుశా మీరు, మీస్నేహితులు చెప్పుచున్న పాకీస్థానపథకానికిసరిపోతుందికాబట్టి యిట్టి పరిస్థితులు సంభవించకుండా మనసమస్యలను పరిష్కరించవలసినది మిమ్ములనుకోరుచున్నాను.

పాకీస్థానానికి ఒక్కపిసరుతగ్గినా మీరుఅంగీకరించగూడదు, పాకీస్థానమునకుసరియైన రష్యామహమ్మదీయరాజ్యాల ఉద్దేశ్యాలను ఎందుకు భంగపంచాలి?

దయచేసి ఈసంగతిమీమనస్సులో వుంచుకొని అవసరమైనప్పుడు పైనాప్రణాళికనుకూడ గమనించ సమస్యాపరిష్కారముచేయవలెను. సకాలములో పైనావుద్దేశ్యాన్ని మీకు తెలియబర్చుకొన్నాను. మీకుఏలైన మీఆరోగ్యమునుగురించి ఈవిషయమై మీ అభిప్రాయములుగురించి తెలియజేస్తూవుండవలెను. ఈవిషయమై అవసరమైనసలహానిచ్చుటకు ఎప్పుడూసంసిద్ధుడు.

భవదీయుడు"

పైలేఖలోనివిషయాలనుబట్టి హిందువులు గాబరాపడనక్కరలేదు. కాశ్మీరు, సరిహద్దురాష్ట్రం సింధులోని జాతీయముస్లింలు, బెంగాలుపంజాబులోని పైవారిటీ హిందువులు ఈరాష్ట్రాలలోని జాతీయముస్లింలసహాయంతో ఎటువంటిపరిస్థితులనైనా యెదుర్కొనగలరు.

పాకిస్థానము ఏర్పడుటకు అవకాశములేదు. కారణము హిందువులువ్యతిరేకమనికాదు మహమ్మదీయులుకూడ అనుకూలంగాలేరు. అందువలనే పాకీస్థానము ప్రజాపరిషత్ (Constitent Assembly) నిర్ణయానికివదులుటకు మహమ్మదు జిన్నా సాహెబుగాని, ముస్లిములీగువారుగాని అంగీకరించుటలేదు.

అసలుఅపాయము పరాయిదేశస్థులవల్లవచ్చును ఈఅలజడిని అవకాశంగాతీసుకొని ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా దేశాన్ని చీల్చాలని ప్రయత్నించవచ్చు, మనంజిల్లాముస్లింలీగులతో పోట్లాడిలాభమేమి? పాకిస్థానమును ఎదుర్కొనాలంటే ముందుబ్రిటిషుసామ్రాజ్యవాదుల్ని అవసరమైతే రష్యాని యెదుర్కొనాల్సి వస్తుంది. ముస్లింలు పాకిస్థానమని హిందువులుహిందుస్థానమనిఅంటే ముస్లిములకుగాని హిందువులకుగాని ప్రయోజనముకాదు, యిట్టిభావాలకు యిట్టిప్రణాళికలకు పరాయిదేశస్థులు ప్రోత్సహించుతూవుంటారు. అదిహిందూస్థానమును "గులాంస్థాన్"గనుంచుటకుమాత్రమే.

(అనువాదం: కె. బాపేశ్వరశర్మ "ఫ్రీయిండియా"నుండి)

## వివేకవర్ధనీ కన్యాశాల

### రజతోత్సవము

హైదరాబాదు(దక్కన్),ఏప్రిలు 3

30 మార్చిహాడు హైదరాబాదునగరంలోని వివేకవర్ధని హైస్కూలుకుసంబంధించిన కన్యాపాఠశాలయొక్క రజతోత్సవమును రాణీఅంబాబాయిగారిఅధ్యక్షతలోజరిపిరి. ఆసందర్భము లో పూనామహిళావిద్యాపీఠస్థాపకులైన కర్వే పండితులును దయచేసియుండిరి. వారిట్లుమాట్లాడిరి. "బాలికలప్రాథమికదశలో అనేకవిషయాలు నేర్చుకొనవలసియుండును అట్టిచోవారికి నిర్బంధముగా ఉర్దూనుబోధించుటను ప్రభుత్వమువారు వదులుకొనవలెను."తర్వాత పెద్దమనుష్యులుకొందరుపన్యసించిరి.

## హైదరాబాదుస్త్రీలు—యుద్ధసహాయము

### లేడీటాస్కరుగారికోరిక

హైదరాబాదు ఏప్రిలు 3

లేడీటాస్కరు గారు ఈక్రిందివిధము గాప్రకటనచేయుచున్నారు. "సుమారు ౧౧ నెలలనుండి యుద్ధసహాయార్థమై మేము పనిచేసుకొనుచున్నాము గతడిసంబరులో ఒక"ఫీట్"ఏర్పాటుచేస్తిమి దానిమూలాన ౨౫,౦౦౦ వసూలయ్యెనని చెప్పుటకుసంతసించుచున్నాము, మీరింకను సహాయము చేయవలెను ఘ-వ-బీరారుయువరాణీగారు యాజమాన్యమువహించి కార్యసంఘముల నేర్పాటుచేసినారు. లేడీహైదరీక్లబ్ బషీరుబాగురోడ్డువద్ద కార్యాలయమేర్పడినది ఇకముందు ప్రతిబుధవారమచ్చట సమావేశములగును. ప్రాతఃకాలము ౧౦ నుండిఒంటిగంటవరకును సాయంత్రం ౪ నుండి౬గంటలవరకును అచ్చటపనిజరుగును. వేలకొలదిగాయపడినభటులకు మంచిబట్టలు దిండ్లు,పరుపులు ఉండినవారు తొందరగా ఆరోగ్యంపొందగలరు. ఈపనులలో స్త్రీలుబాగుగాసహాయపడగలరు. మనము వారిలలోగ్యానికవసరమగువస్తువులను సిద్ధముచేసి పంపగలము రెడ్ క్రాసువారుమననుండి చాలసహాయముకోరుచున్నారు, యుద్ధభటులకు తీరికకాలములో పుస్తకాలు గ్రామఫోను, ఆటవస్తువులు కొనిదాలు ఇట్టివికావలసియుండును. బేగం మెహ్దీయార్ జంగు బహద్దరుగారు మాసంఘానికధ్యక్షులుగానున్నారు హాలిన్సుభార్యగారు చాలశ్రద్ధతో పనిచేయుచున్నారు. హైదరాబాదుస్త్రీలను ఈఉత్తమకార్యములో పాల్గొనసహాయము చేయుదురుగాక.

మ-ఘ-వ-నిజాంగారు

హైదరాబాదు, ఏప్రిలు 3

నగరములో నబీఖానాలోజరిగిన మతసభలో మ-ఘ-వ-నిజాంప్రభువుగారు 3౦ మార్చిరాత్రి ౧-౨ గంటలవరకుండి వెళ్ళిపోయిరి.

## సూర్యాపేట

### ఆర్యసమాజోపన్యాసము

[స్వ-వి-]

౩౦-౩-౪౧

౨౯-౩-౪౧ ఉదయం ౭ గంటలకు ౨౦౦ స్థానిక ఆర్యసోదరులు సమాజభవనమునకు అరుదెంచిరి. అర్ధగంటసమాజములో భజనలు అతిఉత్సాహముతో జరిగెను.

౭½ గంటలకు సమాజభవనమునుండి నగరకీర్తనలుపాడుచు "వైదికధర్మకీజై, మహర్షి దయానందుకీజై" యనుచుజయధ్వనులుచేయుచు ౪ ముఖ్యవీధులలోతిరిగిరి. భజనముదాటి ముఖ్యవీధులలో కిరాగానే ౪౦౦ అనుమించిన ఆర్యయువకులు ఊరేగింపులో పాల్గొనిరి.

తిరిగిసమాజమునకురాగానే "విజయీవిశ్వప తాకాప్యారాఝుండా", యనుకీర్తనతో జండాభివందనము గావించబడెను.

సాయంకాలము ౫ గంటలకు ౩౦౦ మించిన జనముభవనములోమళ్ళి సమావేశమాయెను. ఒక అర్థగంట మృదుమధురమైన వైదికభజనలు గావింపబడినపిమ్మట పండిత హనుమంతరావుగారు సిద్ధాంతిరత్న మరియు శ్రీమాన్ పూజ్య ఆనరవాది వెంకటనర్సయ్యగారు [మంత్రి] ఒకగంటకాలము ఆర్యసమాజస్థాపనదినము పై దీర్ఘోపన్యాసముగావించిరి. శాంతిపాఠముతో సభముగిసెను.

## నారాయణపేట

### రాత్రివైదికవయోజన పాఠశాల ఉద్ఘాటనము, ఓంపతాకారోహణము

(ఒక విలేఖరి)

ఈగ్రామము మహబూబునగరమునకు ౪౦ మైళ్ళదూరమునయున్నది. క్రొత్తసంవత్సరప్రారంభము ఉగాదిపండుగ శుక్రవారం ప్రాతఃకాలము ౪ గంటలకు ప్రభాతభేరి ఊరేగింపు సమాజమందిరమునుండి ఈశ్వరసంబంధముపాటలు మరియు సంఘసంస్కారములగు పాటలుపాడుచు పురవీధులలోతిరిగి ౭ గంటల సూర్యోదయమునకు సమాజభవనమునకువచ్చిరి దాదాపు ౩౦ మంది ప్రజలుపాల్గొనిరి తరుపరి ౮ గంటలకు సమిలితులు హవన్ యజ్ఞము ఈశ్వరప్రార్థన సంధ్య అందరుకలిసిచేసిరి. తర్వాత శ్రీయుత పగిలంబాదాసురావు బి.ఏ, ఎల్. ఎల్. బి. వకీల్ గారి కరకమలముచే ఓం పతాకారోహణము మరియు ఓంపతాకవందనముచేయబడెను, శ్రీయుత కాళిదాసుగారు (విశ్వవిజయ పతాకఓంకఝుండా)అనుగీతమును అతిమధురముగాపాడిరి జనులు ౨ వందలకుపైగావచ్చియుండిరి. యస్, సాంబమూర్తి సిద్ధాంతరత్నంగారు పురోహితముచేసిరి వేదోక్తంగామంత్రములుచదివి ఇద్దరుబాలురకు పలకలపై హింది మరియుతెన్గు శ్రీకారముపెట్టించి శ్రీవకీల్ గారు స్వయంతమహస్తములచే దిద్దివించిరి పిమ్మట పాఠశాల ప్రారంభోత్సవముజరిపిరి.

## సదాశివపేట

### ఆర్యసమాజస్థాపన దినోత్సవము

(విలేఖరి) — -౨౩-౩-౪౧

సార్వదేశిక ఆర్యప్రతినిధి సభాదేహలీ ఆదేశానుసారం నేడిక్కడ ౨౮-౩-౪౧ శుక్రవారం సూర్యోదయమువరకు ప్రభాత్ భేరీ భజనసంకీర్తనలచే చేయబడి ఆర్యసమాజమందిరమునకు వేంచేసియువకులంత స్వగృహములకు స్నానాదినిత్యకర్మ జరుపుటకు వెళ్ళిరి

అనంతరపుణః ఎనిమిదిఘంటలకు సమాజభవనమునకు ఆర్యసోదరులంత ఉపస్థితులై హవనసంధ్యక్రియలుజరిపి ఝండావందనంబుగావించిరి.

ఝండావందనము శ్రీ పూ, కే నారాయణ ప్రధాన కరకమలములచే ఝండారోహణగావింపబడెను

అనంతరమంత్రిగారు ఆర్యసమాజము స్థాపింపబడి ఏమహత్కార్యములుచేసెనో ఉన్నతదశకు మానవజాత్యోద్ధరణకు ఎన్ని పాట్లుపడెనో ఇదంతభజనరూపకంగ విపులంగ తెలియపరచిరి.

పంతర శ్రీ విశ్వనాథ్ జీగారు శ్రీ జీ. రఘురాంజీగారు సంఘబలమునకు పురుషపట్టనుండ కలుషనివారణచేయు లయునని మనుష్యకృత్యములు విస్యయని ఈశ్వరకృత్యములు తథ్యమని భాషణలుగావించిరి.

శ్రీ పం మాస్టర్ శంకర్రావుగారు సమాజ సంబంధమైన గంభీరభాషణభాషించిరి. ఆర్యసోదరులు ఎందరుతిమఆత్మాహుతులిచ్చి ధర్మమును వృక్షమును పెంచి దృఢపరచిరి. యనువిషయము బచాలమాట్లాడి సమాచారపత్రముల సమాచారములుకొన్ని ఉపస్థితజనులకు తెల్పిరి

### ఇండ్లపన్నుల వెలుతురు పన్నులువసూలు

ఇక్కడ లోకల్ ఫండు అధికారులు గ్రామంలో మజాల్ [ఇండ్లపన్నులు] వసూలుచేయుచున్నారు.

కొందరివద్ద ప్రస్తుతసంవత్సరవసూలు అసమాసములు సహితంకాలేదు యొందరినోనిర్బంధపెట్టి సహాయివాండ్లను యిండ్లముందు దుకాండ్లముందుకూర్చోపెట్టి మానావమానములెక్కించక భయపెట్టివసూలుచేయుచున్నారు,

ఇతరులవద్ద ఆరుసంవత్సరముల నాల్గుసంవత్సరములబకాయివసూలుఅంత నిర్బంధపెట్టదములేదు అట్టివారికిప్లీలోకిపోవుటసహితం కష్టసాధ్యంగవుండికాబోలు,

బకాయివసూలు మొదలా లేక ఈసంవత్సర వసూలు మొదలా ఏవసూలుకు ప్రజలనిర్బంధపెట్టవలెనో పైఅధికారులు ఈవైపుధ్యానించినకేకాని ప్రజలబాగోగులు తెలియవు.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర చైత్ర శు॥ ౧౦

సోమవారము


## ఆంధ్ర దేశీయ పత్రికా మహాసభ

మార్చినెల తుది తేదీలలో బెజవాడలో ఆంధ్రదేశీయ పత్రికాసంపాదక ప్రథమ మహాసభ జరిగినది. అధ్యక్షులైన తాపీ ధర్మారావుగారు మంచి ఆరితేరిన సిద్ధహస్తులు. స్వాగతోపన్యాసకులైన అయ్యంకి వెంకట రమణయ్యగారు మంచిఅనుభవశాలురు. సభాప్రారంభకులైన న్యాపతినారాయణ మూర్తిగారు ఆంధ్రపత్రికా ప్రపంచములో నూతనపంథను త్రొక్కినట్టి దిట్టలు. సభకువచ్చినవారిలో బహుకాలానుభవముగలవారును, ప్రసిద్ధులును అయిన పత్రికాసంపాదకులు. ఇది ప్రథమసభ. అనుకున్నంత స్థాయిలో జరుగకపోయియుండవచ్చును. అంత మాత్రాన దానికేమిన్నీ లోపములేదు. ప్రారంభింపబడిన దానిని నిత్యాభివృద్ధితో సాగించుటయే ముఖ్యాదర్శముగా నుండిన భావిదశ తేజోవంతముగా నుండును.

స్వాగతోపన్యాసకులగు అయ్యంకి వెంకటరమణయ్యగారిట్లన్నారు. "ఇతర దేశములలో పత్రికలు ౫౦౦౦౦ ప్రతులు గూడ అమ్మడగును. మన దేశములో ౫౦౦౦౦ ప్రతులను ప్రచురించు పత్రికయే లేదు." ఈవాక్యములో సవరణ అవసరమనిపించుచున్నది. ఇతర దేశాలలో ౫౦ వేల ప్రతులను ప్రకటించుపత్రికను చచ్చు పత్రికగా భావింతురు. ఒక "డెయిలీమెయిల్" అను పత్రికకు ౨౦ లక్షలకు మించిన చందాదారులున్నారు భారతీయ సమస్యలపై సానుభూతిచూపించు మాంచెస్టరు గార్డియను పత్రికకు ౨ లక్షల చందాదారులవరకున్నను దానిని సాధారణ పత్రికలలో జతచేయుచున్నారు. అమెరికాలోను,ఇంగ్లాండులోను పత్రికల ప్రచురణ లక్షల సంఖ్యలోనే గుణింపబడును. మన భారతదేశమందు కొన్ని హిందీపత్రికలకు చందాదారులు సుమారు ౧ లక్ష పరిమితివర కున్నారు. ఆంధ్రులకన్నను అరవవారిలోను, కొన్ని పత్రికలకు ౫౦ వేలకు మించిన చందాదారులున్నారు. ఒక తెనుగుదేశమందే ౧౦వేల సంఖ్యను పొందిన పత్రిక ఒకటియైనను లేకుండుటను కాంచుచున్నాము. అయితే యింతటి కనిష్ఠస్థితికి మనము పాల్పడి యుండుటకు మన అవిద్యయే ఎక్కువవున్నదా? భారత దేశమందలి యితర ప్రాంతాలవారికన్న ఆంధ్రులు (అనగా తెలంగానా ఆంధ్రులు మినహా మిగత ఆంధ్రులు) విద్యలోకాని, ద్రవ్యసంపదలోకాని, తెలివిలోకాని, శక్తిలో కాని వెనుకబడినారని చెప్పజాలము. అట్టిసందర్భములో పత్రికలకు మాత్రమే పట్టిన యీ గ్రహదోషమునకు కారణమేమి? పత్రికాసంపాదక మహాసభవారి యొక్క విషయమును గురించియె ముందు సభ జరుగుకాలములోగా విచారణచేసి ఒక నివేదికను సిద్ధము చేయవలసియుండును. తెనుగుపత్రికలకుండునట్టి దురవస్థకు కారణములను కొన్నిమాకు తోచినవి టూకీగా తెలుపుకొందుము.

(౧) ఎవరుపట్టితే వారు పత్రికలను స్థాపించుట పరిపాటియైనది. నూటికి ౭౫ వంతు మంది అర్హతలేనివారే-ద్రవ్యములోను, శక్తిలోను, అనుభవములోను, లోపముకలవారే సంపాదకులుగా ఏర్పడి కొన్ని దినాలో,మాసాలో పత్రికను ఎట్లో ఒకవిధముగా నడిపినామనిపించి పూర్తిచందాలు ముందేవసూలు చేసుకొనితటాలున ఎవ్వరికిని చెప్పకుండా మాయమగు చుండుటను అనేకసంవత్సరాలనుండి గమనించుచున్నాము. దీని వలన పాఠకలోకానికి క్రొత్తపత్రికలపై విశ్వాసము లేకపోయినది.

(౨) పత్రికలను ఉచితముగా గ్రంథాలయాలకు, సంస్థలకు, స్నేహితులకు, ఇచ్చుట సరియైనదికాదు. కీర్తికాయులైన కాశీనాథుని నాగేశ్వరరావుగారు యీవిషయములో చూపిన ఉదారత వారికే నష్టము కలిగించినదని మాఅభిప్రాయము. ఆంధ్రపత్రిక కొనవలసిన పత్రికకాదు, నాగేశ్వరరావుగారిని ఆశ్రయించిన ఉచితముగా దొరకునట్టిది. అను భావన ఆంధ్రులలో విశేషమైయుండెను. దాని యాదర్శములు చూపుచు ఇతరపత్రికలనుగూడ ఉచితముగా అనుగ్రహించుటకై యిప్పటికిని అనేక సంస్థలను నడుపువారు ప్రార్థనలుచేయుటను కాంచుచున్నాము. ఈయాచారము పూర్తిగా వదలుకొనదగినట్టిది.

(3) ఇప్పటి విద్యావంతులలో ఆంగ్లభాషాసంస్కార శుద్ధియైన వారే బహుళముగానున్నారు. వారికే పత్రికలను చదువు అలవాటుఎక్కువ. కాని వారు ఆంగ్ల పత్రికలను చదువుట కభిలషింతురు. ఆంధ్రపత్రికలను నడుపువారు తమపత్రికలను ఆంగ్లవిద్యాధికులైన ఆంధ్రులును చదువునట్లుగా ఉత్తమస్థాయిలో తమ పత్రికలనడుపవలసి యుండును. పల్లెలలో నుండుజనులకు మనదేశపు భూగోళచరిత్రలే తెలియవు. చాలామంది వీధిబళ్లలోనో వడ్డీలెక్కలను, పెద్దబాలశిక్షను, చిక్కువ్రాత చదువుట, పద్యమువ్రాయుట, భాగవతము చదువుట నేర్చుకున్నవారు. వారుపత్రికలను చదివినను అర్థము చేసుకొనజాలకున్నారు. ఇవికొన్ని కారణాలు. ఇంకను విజ్ఞులాలోచింతురుగాక.

పత్రికామహాసభవారు చేసిన తీర్మానాలలో రెండు గమనింపదగినవై యున్నవి. "తెలంగానములో తెలుగు పత్రికలే మృగ్యమైపోవుచుండుట కడుంగడు విషాదపరిస్థితిగ భావించి ఈపరిస్థితిని తొలగించుటకై శ్రీ నిజాంప్రభుత్వము వారు యత్నించి తోడ్పడెదరుగాక" అనునట్టిది,"పత్రికా నిర్వహణము, తెలుగు సంక్షిప్తలిపి, ఆంధ్రాయూనివర్సిటీవారు అభిమాన శాస్త్రములుగ నిర్ణయించవలెను. ఆంధ్రదేశమందలి ప్రధానపత్రికలు కొందరుపత్రికాప్రవీణులను ప్రత్యేకముగ శిక్షితులు చేయవలయును." అనుయీ రెండు తీర్మానములు ముఖ్యమైనవి. తెలంగానములోని తెలుగుపత్రికలేవన ఒక అర్ధవారపత్రిక, ఒకవారపత్రిక, మూడు మాసపత్రికలు. అందు మూడు సికింద్రాబాదువే. ఇక మిగిలినవి అచ్చుము నిజాంప్రభుత్వాధీనమందుండునవి రెండు, ఒకటి గోలకొండ పత్రిక, ఇంకొకటి మూడు నెలలక్రిందట వెలువడిన ఆంధ్ర కేసరిపత్రిక. ఇదంతయు పంచ పాండవులను నేనెరుగనా అన్నట్టి కథగా ఉన్నది.

కేవలం ప్రభుత్వమే ఈస్థితికికారణమని చెప్పజాలము. టప్పాసౌకర్యములులేకపోవుట మొదటి గొప్పప్రతిబంధకము. అనేకగ్రామాలకు ౧౦ దినాలకొకమారైనను టప్పా సరిగాపోవుటలేదు. ఇక పత్రికలెట్లు వృద్ధియగును. రెండవది ప్రభుత్వమువారు నెలలతరబడి సెలవియ్యక ఆలస్యము చేయుట. మూడవది ఈరాష్ట్రములో విద్యావిహీనత, అందులో తెలంగానాలో మరీశోచనీయస్థితిలోనుండుట. నాల్గవది తెలంగానావాసుల సర్వసాధారణ దరిద్రత. ఇట్టికారణాలతో అవస్థపడుచున్నారు. ఇది తెలంగానా పత్రికారంగము.

రెండవతీర్మానము ప్రకారము పత్రికాసంపాదక సంఘమువారు ఇకముందు క్రొత్త పత్రికలను స్థాపించువారుకనీసము ఒకసంవత్సరమైనను ఒక ఆంగ్లదిన పత్రికలో పనిచేయునట్లుగా భావిసంపాదకులకు నచ్చ చెప్ప వలసి యుండును. ఒక పత్రికానిర్వహణ పాఠశాలనుస్థాపించుట బాగుండునుగాని దానికింకను తరుణము రాలేదని అనుకొందుము.

ఈవిషయాలను, మరియు ఇట్టివిషయాలను దృష్టిలోనుంచుకొని ముందు సంవత్సరము జరుగుమహాసభకు ఆంధ్రదేశమందలి పత్రికా సంపాదకు లందరును విధిగా వెళ్లి పాల్గొని పత్రికాసంస్థలకు గౌరవ ప్రతిష్ఠలు కలిగించి తదభివృద్ధికై తోడ్పడుదురుగాక.

## తహసీల్దార్ల నియామకం

ఈ సంవత్సరం[illegible]నుండి తహసీలు ఉద్యోగా[illegible] ప్రభుత్వం వారు కొందరిని "[illegible]" నేసుకొన్నారు. మొత్తముగరెఖుంది ఆసంఖ్యను పరిశీలించిచూచిన ఈ క్రిందివివరాలు బయలుదేరును: ౫ మంది హిందువులు, ౧ పార్సీ, ౧ క్రైస్తవుడు, ౭మందిముసల్మానులు. భాషావిభాగము ప్రకారంచూచిన ఉర్దూవారు ౭మంది. హిందీవారు ఒకరు, మహారాష్ట్రులు ముగ్గురు, ఆంధ్రుడొక్కడే ఒక్కడు, కేశవరెడ్డిగారు, గద్వాల మహారాణీగారి బావగారి కుమారులు ౧౪మందిలో ఒకఆంధ్రుని తీసుకున్నారు, నూటికి ౫౦మందివంతునఆంధ్రులసంఖ్య. తహసీల్దారునియామకములో నూటికి౭వంతున నియామకము లెక్క తేలుతుంది! ఆంధ్రులకు మంచికాలము ఎప్పుడువస్తుందోయేమో!

## సింగపట్నం చెర్వులో శవము

[ఒకవిలేఖరి]

౨౭-౩-౪౧ జటప్రోలుసంస్థానపు రాజధానియగు కొల్లాపురమునకు ౫ మైళ్ల దూరముననుండు సింగపట్నం పెద్దచెర్వునందు ఆద్దిబేహస్తుఅను తేది ఆదివారంతో బావుదయం ఒకచనిపోయిన శవముకనిపించినదని బోయలువచ్చి గ్రామ పటేలుకు చెప్పగాచే అక్కడికిపోయిచూడగా శవము పొట్టకింద పెద్దరాయి కట్టబడియుండెను చనిపోయినమనిషి సమీపములోయున్న ఎత్తంమనబడు గ్రామపుగొల్ల, ఎరోనని తెలిసినది.వినిపయస్సు ౨౫సంవత్సరము లుండును. చనిపోయినవాడు ౭ రోజులనుండి కనబడకుండుటచే తల్లిదండ్రులు వెతకుచుండిరి.

## అఖిలభారతవర్షీయశ్రీభట్టబ్రాహ్మణ మహాసభ ఆహ్వానము

### శ్రీ ఆంధ్రదేశభట్టబ్రాహ్మణులకు భట్రాజులకు

అమ్మహాసభవారికి మన యాంధ్రదేశవాసుల పరిచయములేమంచేసి మనవుల్లాసములు తెలియనందున నాచెంతకు ఆహ్వానపత్రిక (సమంత్రణపత్రిక హిందీభాషతో అచ్చరముతోబంపియున్నారు. వారికినాహార్దికకృతజ్ఞత తెల్పుచు వద్దానినిటె నిగించి నీదిగువనుదహరించుచున్నాను.

నిమంత్రణాపత్రము

అఖిలభారతవర్షీయ శ్రీభట్టబ్రాహ్మణమహాసభ వార్షికోత్సవముయొక్క విరాటఆయోజనము.

శ్రీశుభస్థానముగు మానీ పోస్టు భదోహీస్టేషన్ భదోహీ (ఇ.ఐ.రైల్వేఇలహాబాదు, బనారసు జంక్షనమార్గముగా) బనారస్ రాజ్యమందు అత్యంతసమారోహముతో ౧౯౯౭ విక్రమశకము తిథిచైత్ర శు౧౫ లుపైశాఖకృష్ణ ౧-౨ లు సరియగు ౧౯౪౧ సంవత్సరంఏప్రిలు ౧౧-౧౨-౧౩ తేదీలు శుక్ర,శని,ఆదిత్యవారములు శ్రీమాననీయ పండితబచ్చునారాయణజీరాయె. బి.ఏ.డిప్టీమేజిస్ట్రేటు అరా(బిహారు)గారి సభాపతిత్వము నజరుగనున్నది దానివెంబడి యూ. పీ. ప్రాంతీయసభయొక్క వార్షికోత్సవము శ్రీపండిత గుల్జార్లాల్జీశర్మ దతౌస్, దేరాడూన్గారిసభాపతిత్వమునమరియునవయువకవిద్యార్థిసమ్మేళనము. శ్రీపండితజగత్రాంజీశర్మ బారిష్టరు గుజరాత్ (బొంబాయి) గారి సభాపతిత్వమునభారతవర్షీయకవిసమ్మేళనము సాహిత్యాచార్య కవిమార్తాండ బిరుదాంకితులగు శ్రీపండితమున్షీ రాంశర్మ బి-ఎమ్-ఏ.ప్రొఫెసర్ కాన్పూరుగారి సభాపతిత్వమునజరుగును.

కావునసమస్తస్వజాతీయ బంధుజనులువిద్యార్థులు కవిజనులు, వ్యాఖ్యానదాతలు మరియు భజనపరులుఅగు మహానుభావులసన్నిధియందుసాదరమున నివేదించుకొనునదియేమనిన మహోత్సవమునందు ఉదారభావముతో సహాయ మొసర్పగోరుచున్నాము.

భదోహీస్టేషను చెంత స్వయంసేవకులుందురు వారుసర్వవిధములసహాయము లొనగూర్పగల కట్టుబాట్లొనర్పబడినవి. ఇకభోజనాదికములు ఆహ్వానసంఘమువారేయొనర్పగలరు.

నిశేషప్రార్థన

౧. యేసోదరమహాశయులకు నిమంత్రణపత్రములందనో వారుకృపాపూర్వకముగా వారతకుచుట్టుప్రక్కనిప్రదేశములందునివసించు జాతీయసోదరులకుదెల్పి ప్రోత్సహించి అధికాధిక సంఖ్యగా మహాసభయందుపాల్గొను ప్రయత్నమాచరించుకొన్నవ్యయును. పాలింప గోరుచున్నాము

౨ పదాధికార నిర్వచనాదులలో మహాసభ ప్రవేశపత్రముతో ప్రవేశచందాచెల్లించినవారు పొందినసభ్యులే పాల్గొనవధికారులు.

౩. తమతమ అగమనాదివార్తలు కృపయుంచి తమతమప్రాంతీయసంచలకగాని మహాసభప్రధానిగారికిగానిలేక స్వాగతసమితికి గాని మార్చి అంతమువరకు దెల్పగోరుచున్నాము.

ఇట్లు నివేదించుకొనువారు

ఆచార్య పండితవిశ్వేశ్వరదయాళభట్టు (ప్రధానసభాపతి) పండితరాంరావుభట్టుహాకీం, (ప్రధానమంత్రి), చౌరాహానయాగంజ కాన్పూరు. రామసేనకురాయె (స్వాగతసమితిసభాపతి) రామలక్ష్మణలాయె (స్వాగతసమితిమంత్రి)మానీ,పోస్టు భదోయి బనారస్ స్టేటు.

కాబట్టి దేశకాలసంస్థితులులెక్కింపక శక్తిగలమహానుభావులధికసంఖ్యాకులు అమ్మహాసభయందు కడుంగడుశ్రద్ధతో పాల్గొని మనదేశకందేశముదెల్పి మన యభివృద్ధికిమార్గము లగుతీర్మానములుప్రపాదించి వెల్గింపజేసి ఆంధ్రదేశమందలి మనజాతికి శుభమొనగూర్చెదరని ఆశతోనవినయముగా మనవి చేయుచున్నాను.

ఇట్లు
చక్రహరినరసరాజుభట్టు
హైకోర్టువకీలు, 'పెంట్లపల్లి'
మహబూబునగరంజిల్లా, (యన్.యస్.ఆర్.]

## ప్రధానమంత్రిగారు

### ఉన్నతన్యాయస్థానమును పరీక్షించుట

రై, ఆ సర్ అక్బర్ హైదరీ ప్రధానమంత్రిగారు గతేవారము హైదరాబాదులోని ఉన్నతన్యాయస్థానము[illegible] ఆసందర్భములో ప్రధానన్యాయమూర్తి శ్రీవారికి కోర్టులోని వివిధవిషయములనుచూపించి వారిగౌరవార్థము సభచేసి వారిగుణవిశేషములు పలువిధములశ్లాఘించిరి. అందుపై శ్రీవారుఈవిధముగా ప్రత్యుత్తరమిచ్చిరి. "మనప్రభువుగారున్యాయశాఖను ఎక్జిక్యుటివుశాఖనుండివిడదీసి వేరుచేసిప్రజలకుమహోపకారమొనర్చినారు. దీనిమూలాన న్యాయము స్వతంత్రతపొందినదైయున్నది. న్యాయమునిష్పక్షపాతముగా తొందరగాపరిపాదించుటఅనపరము ఈగుణాలు ఇంగ్లీషువారిలోవుండుటచే తనే వారిప్రతిభ ప్రపంచములో అద్వితీయమైయున్నది"

## పురపాలక సంఘము

### వగంటలకొక నిర్ణయము

హైదరాబాదు[దక్కను], ఏప్రిలు౫

౨ఏప్రిల్ నాడు హైదరాబాదు పురపాలక సంఘసభ్యులు సమావేశమైరి. ఒక డాక్టరును హెల్తుఆఫీసరుగా నియమించుటకై చర్చజరిగెను. అభ్యర్థులిద్దరు డాక్టర్ నాయుడు అనువారు డాక్టర్ సాలేఅనువారును, పురపాలకసభ్యులకొందరు ఒకరిపక్షానను మరికొందరింకొకపక్షానను పెద్దఉపన్యాసాలనిచ్చిరి. రెండున్నర గంటలవేపు ఈప్రకారంపోపన్యాసాలు జరిగెను. ఇకవోటుకు వచ్చేవరకు కొందరిట్లనిరి. 'యే[illegible]ము రహస్యంగానెస్తాము. ఆదేవిధంగా వోట్లుతీసుకోనబడెను ౧౫మందిఒకరికి ౧౫మందిఇంకొకరికి వోట్లిచ్చినట్లులెక్కతేలెను. అప్పుడు అధ్యక్షులగు శ్రీధరనాయుడుగారు తమ వాలకమువోటును [Casting vote] డాక్టరు నాయుడుగారికిచ్చి వివాదానికి స్వస్తి పాఠముచదివిరి.అంతటలో ఆనాటిసభ ముగిసింది.

## ఖద్దరుధారులు బద్మాషులా?

### ఒకటీచరు అసందర్భ ప్రలాపం

[ఒక విలేఖరి] నల్లగొండ. ౫-౩-౪౧

ఇచటహైస్కూలు మెట్రికుతరగతులకు "అఖ్లాఖియాతు" చెప్పటకు రామాకుమాస్టర్ సాఅనుఒకటీచరును నియమించినారు, వీరుతరగతులలోఅఖ్లాఖియాతుచెప్పటకు మారుగాఇతరవిషయములువివరిగాచర్చించుచుందురు. ఒకసారిహింసగురించిచెప్పుచుపూర్వము శ్రీరామచంద్రుడుకూడామాంసమునతినెనియు వేదములలోమాంసభక్షణన్యాయమని వ్రాసియున్నదని చెప్పిరి. ఈతని వుపన్యాసము విద్యార్థులలో అలజడికలిగించినది. సుమారు ౧౫ రోజులక్రింద [౮]వ ఫారము తరగతిలోఅఖ్లాఖియాతుచెప్పుచు "హిందూదేశమునుండి దరిద్రమును ఎట్లుపారదోలవలయును?"అనిప్రశ్న వేసిరి. విద్యార్థులు వారివారిఅభిప్రాయములు తెల్పిరి, అందులో టి. బుచ్చయ్య అనువిద్యార్థి "ఖాదీ, స్వదేశపువస్తువులను వుపయోగించవలయును"అని అభిప్రాయమిచ్చెను" అందుకు మాల్వీ సా॥గారు కోపంతో ఖాదీఖాదీ కెహ్తేహై (ఖాదీకోపహన్తే హై సబు బద్మాషుహోతే హై)" [ఖాదితొడుగువారలంతాబద్మాషులు] అనిఅనెను. అందుకైఆవిద్యార్థి ఈవిధంగా చెప్పవలసినదికాదని దీనిపైమీమతగుచర్చతీసుకొందుమనిఅనెను. అందుకుటీచరు వెంటనే హెడ్మాస్టరువద్దకుపోయి తరగతులలో విద్యార్థులు మతసంబంధమైన చర్చలుజరుపుచుందురనిరి- దానికి టి. బుచ్చయ్య నాయకుడని తెల్పెను- అందుకు హెడ్మాస్టరుగారు విచారణచేయనిరాకరించిరి. కొనిపికారణములతో రెండవరోజుఆతరగతిఅఖ్లాఖియాతు చరితకబ్లిలకు ఒకరవాలుచేసుకున్నచేసియిచ్చి వారిజవాబులులిఖితరూపకంగాతీసుకొనిరి, రెండవరోజు టి. బుచ్చయ్యను "నీవుతరగతి లో మతచర్చలుచేసితేవినపోని కలహాలుతెచ్చిపెట్టుచున్నావు. విచారణపై నీకస్పెలు అవసీలినది. నీవుక్షమాపణపత్రము దాఖలుచేసినపోసిపేరునరికచేసుకోబడును"అని నోటీసుయిచ్చినారు బుచ్చయ్య క్షమాపణపత్రమునుయిచ్చుటకునిరాకరించెను ముందునుయేమిజర్గునో తెల్యదు.

# ఆదర్శప్రాయుడగు సంపాదకుడు

## శ్రీ తాపీ ధర్మారావుగారి వివరణము

బెజవాడ, మార్చి 30

ప్రథమ ఆంధ్రపత్రికా సంపాదకుల మహాసభ నిన్నరాత్రి 7-30 గంటలకు కౌగిడాపత్రిక సంపాదకులైన శ్రీ తాపీధర్మారావుగారి అధ్యక్షత క్రింద బెజవాడ రామమోహన గ్రంథాలయమునందు జరిగెను.

చాలమంది పత్రికాసంపాదకులు ఆంధ్రదేశమునుండి ప్రతినిధులుగ వచ్చిరి.

ఆహ్వానసంఘాధ్యక్షులైన శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు ఉపన్యాసము చదివిరి.

శ్రీ నారాయణమూర్తిగారు సభను ప్రారంభించుచూ తెల్పించిరి, పత్రికాసంపాదకులు ప్రజాభిమానానికి ప్రజాశయాలకు అనుకూలంగా ఉండేటట్లు పత్రికలను నడుపుతూ ఉండడం చాల అవసరమనిరి.

### ఢిల్లీ సమావేశము

అఖిలభారత వార్తాపత్రికల సంఘము వారు చేసిన కృషిని ప్రశంసిస్తూ ఆసంఘాధ్యక్షులైన కె. శ్రీనివాసన్ (హిందూపత్రికా సంపాదకులు) గారి సేవా ప్రశంసా పాత్రమైనదనిరి. వారి అధ్యక్షత క్రిందనే కేంద్రప్రభుత్వము పత్రికల విషయములో చేరాని కిదిగి వచ్చి యుద్ధవార్తలను, సత్యాగ్రహవార్తలను కూడ ప్రకటించుటకు ఒప్పుకొన్నారనిరి, పత్రికా సంపాదకుల ప్రతిష్ఠ హెచ్చు జరిగిన ఢిల్లీ కాన్ఫరెన్సునుండి చాలయెక్కువైనదనిన అతిశయోక్తి కాదనిరి. ఉపన్యాసము ముగించుచూ యిప్పుడిప్పుడే ప్రభుత్వము వారు ఆంగ్లపత్రికలతోపాటు, దేశభాషాపత్రికలకు కూడ సమానాదరగౌరవము నిచ్చుచున్నారనిరి?

### అధ్యక్షుని ఉపన్యాసము

తర్వాత అధ్యక్షుడు శ్రీ తాపీధర్మారావుగారు ఉపన్యసించుచు సంపాదకుడంటే ఉపాధ్యాయులకు ఉపాధ్యాయుడు డాక్టర్లకు డాక్టరు, రాజకీయవేత్తలకు రాజకీయవేత్త, గాయకులకు గాయకుడు, శాస్త్రజ్ఞులకు శాస్త్రజ్ఞఅయి, ఒక్కమాటలో మహామహోపాధ్యాయుడై ఉండవలెననిరి. ప్రజలను సరియైనమార్గంలో విజ్ఞానవంతులుగా చేసే బాధ్యత అతనిపైనున్నదనిరి ప్రజలకు బోధింపవలసిన ఏవిషయముమీదనైననుసరే వ్రాయగలిగి ఒకరిచేత వ్రాయించగల సత్తా సంపాదకునకుండవలెననిరి, ప్రస్తుతం మనదేశములో సంగీతం, కళ, సారస్వతం మొదలైనవిషయాలమీద గట్టివ్యాసము వ్రాయగలవారు ఒక్కొక్క విషయంలో ముగ్గురు, నలుగురు కంటె ఎక్కువమంది లేరనియు, ఆఉన్నవారు వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపరనియు, అందుచేత సంపాదకుడయినవాడు ప్రతివిషయంలోను విజ్ఞానసమృద్ధిగా సేకరించుకొని ఉండవలెననియు చెప్పిరి, అట్లున్నప్పుడే ప్రజలను సన్మార్గంలో విజ్ఞానవంతులను చేయగలడనిరి.

ఈయుద్ధపు రోజులలో పత్రికలు ఎన్నిరకాల కష్టములకోర్చి నడిపించుచున్నను ఆంధ్రుల ప్రోత్సాహము యితరప్రాంతములతో పోల్చిచూచినచో చాల తక్కువగును, ఒకపత్రికను పదిమంది ఉచితంగా చదువుదురని పత్రికలుకొని చదువుట ప్రతివారు అలవరచుకొని నేగాని పత్రికలు బాగుపడి ప్రజాసేవ చేయలేవనిరి,

### రెండవరోజు చర్య

నేటి సాయంత్రము సభవారు అఖిలభారత వార్తాపత్రికల సంపాదక సంఘవారియొక్క ఆదేశాలనంగీకరించుచు తీర్మానించిరి. అఖిలభారత పత్రికా సంపాదకుల స్థాయిసంఘమందు ఆంధ్రులకు రెండు స్థానము లొసగవలసినదని తీర్మానముకూడ ఆమోదింపబడెను.

### సభలో కల్లోలము

తీర్మానములన్నియు ఆమోదింపబడిన తరువాత పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రిగారు (ఆంధ్రకేసరి సంపాదకులు, బందరు) నేటి ఆంధ్రప్రభ పత్రికయందు రాత్రిజరిగిన సంపాదకులయొక్క వార్త ముమందుగానే సభజరుగకపోయినను సభజరిగినట్లు వార్త ప్రకటించి, సభకు రానిపోరుగూరి సంపాదకుని పేరు ప్రకటించినందుకు ఆంధ్రప్రభపత్రిక చర్యను ఖండించుచు తీర్మానము తేవగా దానిని అధ్యక్షులు నిరాకరించిరి. ఆతీర్మానమును గూర్చి అధ్యక్షుడు వార్తాపత్రికలు యిటువంటి సభలను గూర్చి వార్తలు ప్రకటించుట ఆచారమేననిరి

అందుపైన అధ్యక్షునియొక్క చర్యకు అసమ్మతి తెల్పుచు, కొంతమంది సంపాదకులు సభనుండి లేచిపోయిరి. ఇంతలో సభయందు కోలాహలము, కేకలు ఎక్కువయ్యెను. అంతమీదట కొంతకొంతమంది ప్రముఖులుపోయి సభనుండి లేచిపోయినవారిని సభకు తీసుకొనివచ్చిరి అంతట అధ్యక్షులు లక్ష్మీపతిశాస్త్రిగారిని తీర్మానమును ఉపసంహరించుకొనవలెనని కోరిరి లక్ష్మీపతిశాస్త్రిగారు మాట్లాడుచు ఇట్లు మరల జరుగకుండా ఆంధ్రప్రభవారు తగుఏర్పాటు చేసెదమని వాగ్దానము చేసినయెడల తాను తీర్మానమును ఉపసంహరించు కొనెదమనియు చెప్పిరి.

అంతట నారాయణమూర్తిగారు యివారి ప్రకటించినవార్తయందు తప్పదేమియు లేదనియు, యిటుల చేయుట పత్రికలకు ఆచారమనియు, రానివారిని వచ్చినారని ప్రకటించుట శోచనీయమైనదనియు చెప్పిరి. లక్ష్మీపతిశాస్త్రిగారు తీర్మానమును ఉపసంహరించుకొనిరి,

### సంఘోద్దేశములు

ఈసభకు హాజరైన పత్రికాసంపాదకులు ప్రాథమిక సభ్యులుగ ఆంధ్రదేశీయ పత్రికా సంపాదక సంఘము నేర్పరచుటకు తీర్మానించుట ఆయెనది. ఆంధ్రదేశీయ పత్రికాసంపాదకులు యిందుసభ్యులుగనుండుటకు అర్హులు. ఆంధ్రదేశమందలి పత్రికలయొక్కయు, పత్రికా సంపాదకులయొక్కయు అభివృద్ధిక్షేమములు ఈ సంఘోద్దేశములు.

స్థాయిసంఘమునందు కనీసము యిద్దరు ఆంగ్ల ప్రతినిధులకు ప్రాతినిధ్య మొసంగవలెనని యీ సభవారు కోరుచున్నారు.

పత్రిక కాగితము ధరలను ప్రభుత్వము నిర్ణయము చేయవలెను.

ప్రతిపత్రికయొక్కయు కొన్నిప్రతులను ప్రభుత్వమువారు విధిగా ఖరీదుచేస్తూ పంచాయతీలు, లైబ్రరీలు, మ్యూజియముల గైరా పబ్లిక్ సంస్థలు ఖరీదుచేసే పత్రికలవిషయమై ప్రభుత్వమువారెట్టి నిరోధమును కలిగించకూడదు.

### తెలంగాణామందలి తెనుగు పత్రికలు

తెలంగాణాయందు తెనుగుపత్రికలే మృగ్యమైపోవుచుండుట కడుంగడు విషాదపరిస్థితిగ భావించి యీపరిస్థితిని తొలగించుటకై శ్రీ నైజాము ప్రభుత్వమువారు యత్నించి, తోడ్పడెదరుగా, యని యీసభవారు తీర్మానించుచున్నారు.

### పత్రికానిర్వహణ శిక్షణము

పత్రికానిర్వహణము, తెలుగుసంక్షిప్తలిపి మున్నగువిషయములను ఆంధ్రయూనివర్సిటీవారు తమయాధీనమందలి ఇంటర్ బి.ఏ.లలో అభిమానశాస్త్రములుగ నిర్ణయించవలెననియు ఆంధ్రదేశమందలి ప్రధానపత్రికలు కొందరు పత్రికాప్రవీణులను ప్రత్యేకముగ తర్ఫీదు చేయవలెననియు యీసభవారు కోరుచున్నారు.

ద్వితీయ ఆంధ్రదేశీయ పత్రికాసంపాదక మహాసభ చిత్తూరుజిల్లా తిరుపతిలో జరుపుటకు శ్రీ పి.టి. జగన్నాథరావుగారి ఆహ్వానమును ఈసభవారు అంగీకరించుచున్నారు.

### కార్యస్థానము

ఆంధ్రదేశీయ పత్రికాసంపాదకసంఘముయొక్క కార్యస్థానము బెజవాడలో నుంచుటకు తీర్మానించుట యైనది.

### స్థాయిసంఘం

ఈమహాసభా యుద్దేశ్యములు, తీర్మానములను అమలుపరచుటకునుయిం మవిషయమై ప్రభుత్వము వారితోను, అఖిలభారతపత్రికాసంపాదకులతోను, తదితరులతోను సంప్రదించుటకు యీదిగువ వారిని స్థాయిసంఘముగ నేర్పరచడమైనది.

వీరుతమలోనుండి యొకకార్యవర్గము నేర్పరచుకొని నిబంధనాదికమును నిర్ణయించుకొనవలెను

(అధ్యక్షులు) శ్రీయుతులు తాపీధర్మారావు (చెన్నపురి) ఉపాధ్యక్షులు న్యాయపతి నారాయణమూర్తి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు (మద్రాసు), వేముగంటి నారాయణమ్మ (కోకనాడ) సురవరం ప్రతాపరెడ్డి, (హైదరాబాద్). (ప్రధాన కార్యదర్శి) అయ్యంకి వెంకటరమణయ్య పంతులు (బెజవాడ) సహాయకార్యదర్శులు పి.టి. జగన్నాథరావు (తిరుపతి), (యం. జె. ప్రకాశరావు చెన్నపురి) (కోశాధికారి) అన్నకరపు సుబ్బారావు గుప్త [బెజవాడ].

సభ్యులలో కుసుమధర్మన్న [రాజమహేంద్రవరం], శ్రీ వేదాల తిరుమల వెంకట రామానుజస్వామి [హైదరాబాదు], శివలెంక శంభుప్రసాద్ [చెన్నపురి] మున్నగువారుగలరు. ఇతరస్థానములను స్థాయిసంఘమువారు పూర్తిచేయవచ్చునని అధికారము ఈయబడినది.

---

**కడుపులో బొత్తిగా ఆహారము లేనప్పుడు కూడా రోగి ఆహారము వద్దనును**

మలేరియాజ్వరపీడితుడు ఏఘనఆహారము తీసుకోలేకపోవడమే ప్రమాదము నకు కారణము. జ్వరపు విషముచే నిర్బలమైనర స్నాయువులకు తిరిగి శక్తిని చేకూర్చుటకు పుష్టికర ఆహారము అత్యావశ్యకము ఆహారము అగత్యమైనప్పుడు కడుపు బలహీనముగానుండుటచే ఆహారము జీర్ణమవదు-

ఇట్టిస్థితిలో డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫారసుచేయుదురు- ఇదివంటకువంద పుష్టినిచ్చునది- జీర్ణశక్తికి ఏలాటి హానికలుగ జేయక సులభముగా జీర్ణమై నరస్నాయువులకు పూర్వపుపటుత్వము కలుగజేయును- తేనడకాలను ... గాముల రాకుండ రక్షించును-

మలేరియామృత్యువునుండి తప్పించుకొన్న వేలకొలదిజనులు హార్లిక్సుసేవనవలన స్వల్పకాలములోనే దేహదారుఢ్యమును పొందియున్నారు- అన్ని పెద్ద ఆస్పత్రులలోను జ్వరబాధితులకు హార్లిక్స్‌ను ఇచ్చుఏర్పాటుచేసినారు-

## ఆంధ్రయువతీ మండలి

హైదరాబాదు [దక్కన్], ఏప్రిలు ౨ ... మండలివారు ఉగాదినాడు హైదరాబాదునగరంలో రెడ్డివసతిగృహములో సమావేశమైరి. పింగిలి కోదండరామారెడ్డిగారి కుమార్తెయగు శ్రీమతి రాపాక ఫిరోజీబాయిగారు అధ్యక్షత వహించిరి. సుమారు ౨౦౦ వందమంది స్త్రీలు సభకు వచ్చిరి అధ్యక్షురాలీవిధంగా ఉపన్యసించిరి.

హైదరాబాదనగరమునందు ఆంధ్రస్త్రీల అభివృద్ధికొరకు ఈమండలి స్థాపింపబడినందుకు చాలా సంతోషము. ఇదిదినదినాభివృద్ధిచెంది ఇతరప్రాంతములయందున్న సంఘలనుమించి పనిచేసి మన ఆంధ్రస్త్రీలనందరిని ఈమండలి అజ్ఞానమను చీకటిలోనుంచి జ్ఞానమను లోనికి తెప్పించగలదని నా ప్రథమవిశ్వాసము నాసోదరి శ్రీమతి రంగమ్మ దీనికి అధ్యక్షురాలుగనుండి ఈమండలిమంచి అభివృద్ధికి తెచ్చినది ముందుకూడనిదేవిధముగ ఈ సంస్థ యందు అభిమానముబదలక ఇంక యెన్నియో రెట్లు అభివృద్ధిలోనికి తేగలరని నాప్రార్థన,

ఇతరప్రాంతములయందు స్త్రీలు ఎన్నియో పనులుచేసి తమదేశమును ముందుకు తెచ్చుచున్నారు కావున మనదేశమునందుకూడ ఈమండలి సహాయమువల్ల స్త్రీలు బాగుగా ముందుకు రావలెనని నా హృదయపూర్వకమైన కోరిక,

ఈమండలిలో కుట్టుపని సంగీతము బాగుగా నేర్పించు ఏర్పాట్లు చేసియున్నారు. మండలి సభ్యురాండ్రు శ్రద్ధవహించి వీటిని నేర్చుకొనగలరని మనవి.

ఈమండలికి స్వంతభవనములేదు, ఇదిపూర్తిచేయుటకు ఒకగృహనిర్మాణకమిటీ స్థాపింపబడినది దీనికి పూజ్యులైన శ్రీమంత మ॥రా॥ శ్రీ రాజాబహద్దర్ వెంకటరామారెడ్డిగారు అధ్యక్షులువారి అమూల్యమైనసహాయముచేత కొంతధనము సమకూడినది మీరుగూడ ఈ సంఘమునకు సర్వవిధముల తోడ్పడి తమకుతోచిన విరాళములనిచ్చి స్త్రీల అభివృద్ధికి పాటుపడవలెనని నా విజ్ఞాపన.

ఈమండలి శుభదినమైన నూతన సంవత్సరము నుంచి అభివృద్ధినొంది యశస్సు సంపాదించి ఆంధ్రదేశమునకు పెద్దపేరు పొందగలదని నాహృదయపూర్వకముగ ప్రార్థన, మరియొకసారి మీ అందరికిని మండలి అధ్యక్షురాలువరకు మా సభ్యురాండ్రులకును నాకృతజ్ఞతపూర్వక వందనములతో ముగించుచున్నాను.”

### ఆత్మహత్య

ఖమ్మం మార్చి౨౫.

౨౫ మార్చి నాటి ఉదయము టీటుమార్కెటు సమీపమునగల మంచినీటిబావియందొక స్త్రీ శవము తేలెను. ఆమె ఆకుమారి రామయ్యగారి భార్యయని తెలియవచ్చెను. వైశ్య యువతి, సుమారు ౨౫ సంవత్సరములలోగానుండు యీమెకు జీవితముపై ఎందుకు ఇంత త్యాగము కలిగెనో పాపము క్షమించుగాక!

యీమధ్యాహ్నం పోలీసువారు పంచనామా చేసిరి

# నా మెదకు జిల్లా పర్యటనానంతరము

## పోలీసులనుండి ఒత్తిడి

హైదరాబాదు (దక్కన్), ఏప్రిల్ ౫ తేదీ ఆంధ్రమహా సభాధ్యక్షునిగా మెదకుజిల్లాపర్యటన కావించి వచ్చినతరువాత అక్కడి కొన్నిచోట్లనుండి ఘోరమైనవార్తలువచ్చుచున్నవి. అయినను క్రొత్తవికావు. ఎల్లారెడ్డి తాలూకాలోని ఒకగ్రామమునుండి వచ్చినలేఖనుబట్టిచూడ నెన్నటి నాయీపర్యటనవల్ల అక్కడి ప్రజలకు లాభముకాని, సౌఖ్యముకాని కలుగుటకు బదులు కష్టములు, ఇబ్బందులుఅధికమయ్యెను. నా యొక్కయు, నాసహచరులయొక్కయు, పర్యటన వివరములను తహశీలుకు తెలియజేయలేదనునేరముపై పోలీసుపటేలుకు జుర్మానావిధింపబడినది. అంధ్రోద్యమములో పాల్గొనువారి ఆస్తి యీనేరముక్రిందనైన జప్తుచేయబడునని ప్రజలు భయపెట్టబడిరి. పోలీసుపటేలుకు జుర్మానా చేసినఅంశమును గూర్చి నాకుపట్టింపునులేదు, అతనిపక్షమున వాదించుటయులేదు. కాని ప్రజలనుభయపెట్టుటకు చేయబడుచర్యలు చాలాదారుణమైనవని చెప్పవలసివచ్చుచున్నది. "మీరుఆజ్ఞలేకుండ నాగభూషణముకంపౌండులో భజనచేయుచున్నారు మీరు తహశీలు యెల్లారెడ్డినుంచి భజనకు ఆజ్ఞ తీసుకొనే అంతవరకు భజనఆపిచేయవలయును. లేనిచో ప్రజాశాంతిరక్షణ నియమావళి(తహఫూజుఅమ్నెఆమ్మా జాప్తా)ననుసరించి మీపైచర్యగైకొనబడును"అని యెల్లారెడ్డిపోలీసు స్టేషన్ హవుసునుంచి శ్రీయుతులు నాగభూషణము, శివ్వాగౌడు, మరియుశంకరయ్య (యెల్లారెడ్డినివాసులు) గార్లకేర నోటీసుయివ్వబడినది. ఒక వ్యక్తి యొక్క సొత్తుదైనా, అతనివాక్కు, భుక్తములోనున్న అతని యింటిఆవరణలో భజనజరిగినఎడల అట్టి భజనను అపుటకు పోలీసువారికియేశాసనము (ఖానూన్), లేక యేనియమము [ఖాయిదా]ననుసరించి అధికారముగలదో నేను తెలిసికొనజాలకున్నాను. ఈ పోలీసుముంతజిం,ఖానూన్, ఖాయిదాలనుపూర్తిగా తెలియనివాడనియు, లేదా ప్రత్యక్షముగా ప్రజలు తమన్యాయమైనహక్కులను పొందకుండ ఇట్టివిధానమును అవలంబించినాడనియు స్పష్టముగ తెలియుచున్నది. ఈనాడు పోలీసువారి యిట్టి చర్యలు యెంతమాత్రమైనను భరింపబడజాలవు.

ఇందుకొరకై హైద్రాబాదులో పౌరస్వత్వములు [సివిల్ లిబర్టీస్] లేనియందురు,అనుదినము యిట్టికఠినమైన లనుభవములుయెదురొక్కనుచున్నవారే ఈవిషయమును గుర్తించగలరు. మరియు మిగిలియున్న కొద్దిపాటిగ్రంథమైనస్వాతంత్ర్యమును స్థానికసంబంధాధికారులుతమకుగలఅధికారములనుతప్పుడుగను, అక్రమముగను ఉపయోగించుచు అణగద్రొక్కుటకై తులమాగియున్నారు. గ్రంథాలయములలోపత్రికలుచదువుటకు గాని,లేక యేదేని స్వంతస్థలమున భజనచేయుచు ఆధ్యాత్మికశాంతినొందుటకుగాని పక్కదనుండి ఒకచోటా డియుండుట వారికేమాత్రము యిష్టములేదని స్పష్టపడుచున్నది.

మనముతెలిసికొని అర్థముచేసికొను శాసనములను, నియమములను రైతులు తప్పుడర్థముచేసికొనవచ్చును,లేదావారికి తెలియక చేయుండవచ్చును అయినను శాసనములు తెలియవని చెప్పుకొనువంతమాత్రమున రైతులకు ఏమియులాభము కలుగజాలదు. శాసనవిరుద్ధమైన చర్యలుచేసినవారలు శిక్షనుఅనుభవించవలసియే యుండును. కాని శాసనములను అమలుజరిపించునట్టి బాధ్యతగల స్థానిక ఉద్యోగులే శాసనోల్లంఘనమును గావించిన, ఏమి శిక్షనిర్ణయింపబడియున్నదో తెలియదు. ఎక్కడైనఎవరేని న్యాయశాస్త్రరీత్యా శాసనోల్లంఘనమును గావించినందుకు బాధ్యులుగాజేయబడినదా, ఇట్టి ఉదాహరణము యిక్కడదొరకజాలదు. పదేపదే పిర్యాదులుచేసినప్పుడు పైయధికారులు పాలనవ్యవస్థకై ఆ తప్పుడుచర్యలను దిద్దియుండవచ్చును. లేదాఎక్కడకొక్కచో క్రిందిఉద్యోగి హెచ్చరింపబడియుండవచ్చును.అంతేకాని యేస్థానికోద్యోగుల యినుపపిడికిలివంటిపాలనలో ఏరు లంచిక్కియుందురో అట్టివారిఅత్యాచారములను, నిరంకుశత్వమును అరికట్టుటకు పరిణామకారకమగువిధానముఇదియని ఆచరణరీత్యా తేటపడుటలేదు. అందుకొరకే ప్రతినిత్యముయిట్టిసంఘటనలనేకములుజరుగుచున్నవి. ఈకారణముననే వేరొకసందర్భమున "మాతెహతునవాటీ" [అనగా క్రిందిఉద్యోగులనుబ్రోచుట]వలన ఒకవైపు స్థానికోద్యోగులకు దుష్టధైర్యము పెరుగుచుండిన,ఇంకొకవైపు ప్రజలలోనిరుత్సాహము, ఆయుష్టతపెరిగిపోవుచున్నది. నియమములు,నిర్బంధములన్నియు ఒకహిందువులకేననియు, యిత్తెహాదుల్ ముస్లిమీనుయొక్క ఉద్యమముల కై ఈనిర్బంధములువర్తించవనియు సాధారణముగా ప్రతివారుఅభిప్రాయపడుచున్నారు. ఆచరణయందున్నట్టి శాసనములందుగాని, నియమములందుగాని అధిక్యతనుప్రకటించ సూత్రములులేకున్నను స్థానిక సంబంధాధికారులు తమఇంగితమును, ఉచితజ్ఞతను,ఉపయోగించుచున్నందువలన ఇట్టిఫలితము తేలుచున్నవి. కనుక ఇట్టిపరిస్థితులలో ప్రజలకును, నా కార్యకర్తలకును, సేవియ్యగలిగినసలహా "ఓర్పుకొనుచు మంచిపరిస్థితులకై వేచియుండుడు"కష్టములను ఓర్చుకొనుశక్తి ప్రసాదించుటకును, పరిస్థితులు త్వరగా బాగుపరచుటకును పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

మం. రామచంద్రరావు.

ఆం. మం. సభాధ్యక్షుడు

---

# శ్రీసీతారామ సాగర్ లేక తుమ్మలచెర్వు (నెల్లిపాక)

## అభివృద్ధికై కొన్ని సూచనలు

ఈగ్రామము పాల్వంచ తాలూకాలోనిది. స్వల్పభాగము ఖాల్సాకును విశేషభాగము పాల్వంచసంస్థానమునకును చెందియున్నది. గ్రామమునకు ౨ మైళ్లదూరమున సీతారాంసాగర్, లేక తుమ్మలచెర్వు అనేపేరుతోనొక మహాతటాకము గలదు దీనియొక్క లోతట్టునుమూరువేయికరములకుపైగానుండునవచ్చును. ఇది ప్రతాపరుద్రమహారాజు కాలమునాటిదని వినికిడి. చెరువుసమీపమున తుమ్మలచెరువనునొక కోయగూడెము కలదు. చెరువుచాలాయెత్తు ప్రదేశములోకలదు. పర్వతములేచాలభాగము కట్టగా నేర్పడినది కొద్దిభాగము మానవనిర్మితమైనది. చెరువుగట్టుపైనొక చిన్నఆంజనేయదేవాలయముకలదు. ఆవిగ్రహము యొక్క దృష్టి సరిగా చెరువుతూముపైబడి రక్షించుచున్నది.

ఈచెరువుక్రింద పారుదలగల కాలువలవి మైనవి మూడుకలవు. అందొకటి "నల్లి: పాటి" కాలువ. దీనిపొడవుసుమారు ఇంచుమించు ఆరుమైళ్లుండును. రెండవది "చేదలవ కాలువ. ఇది నాల్గుమైళ్లుపొడవుండును. మూడవది "కుందవరపు" కాలువ ఇదిరెండుమైళ్లుపైగానుండును. ఈమూడుకాలువల మధ్యప్రదేశములో ప్రస్తుతం రెండువేలయకరములు సేద్యములగుచున్నవి. ఇంకనుసాగుబడి జరుగవలసిన ప్రదేశము ఒదుమూడంతలుండును. కానిఆప్రదేశము అరణ్యముతో నిండియున్నది. యీప్రదేశమంతకును రెండుపంటలకు తగునీటిని సప్లయిచేయగలచెరువియ్యదియనవచ్చును. పైనచెప్పినమూడుకాలువల నుండి నిరంతరంనీరుప్రవహించుచు గోదావరిలోనికిపోవుచుండును. ఖాల్సాసంస్థానములకు మాఫీలపోను సాలీనా పదివేలరూపాయిలురకము చెల్లుచున్నది. సంస్థానమునకు విశేషాదాయ మొసంగుగ్రామములో రెండవగ్రామ మీనెల్లిపాకయనవచ్చును ఈగ్రామముఖండు ౫వేలరూపాయిలవి లువగల చెన్నువాశోవ్ కోర్టుఆఫ్‌వార్డ్సువారు ఆయిదువత్సరములనుండి పాలించుచున్నారు ఆనేకవిధములుగా అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చుచున్నారు. ఆనేకమంది పెద్దఅధికారులు ఈచెర్వువద్దవేటచేయుటకైవచ్చుచుందురు. ఇయ్యదికేవలము అరణ్యముతో నిండియుండుటచేతను నొకమూలప్రదేశమగుటచేతను సౌకర్యములులేకపోవుటచేతను యీచెరువుక్రిందచాలభూమి నిరర్థకముగానున్నది.

అభివృద్ధి సూచనలు-

ప్రస్తుతమీచెర్వునిమిత్తమై ఒకలక్షరూపాయలువెచ్చించినచో సంవత్సరమునకు పాలకులకు డెబ్బదివేలు లభించుననవచ్చును. ముందుగా నీచెరువుక్రిందగల అడవినంతనుకొట్టించివేయవలయును చెరువుకట్టపై పెరిగినబడిన యెంతభూమికలదో దృగ్గోచరముగునట్లుండవలయును. కాలువలనిమిత్తం ౨౦మంది గేంగుకూలీలుపనిచేయుచుండవలయును వీరిపైనొక మేస్త్రీయు నొకఓవర్ సీయరుకూడనుండవలయును. ౫సం౹౹ములు మాఫీతో రైతులకు పట్టాలుచేయబడునని పత్రికలద్వారా వివిధప్రాంతములకు తెలియునట్లుచేయవలయును చెరువుకట్టవరకు చక్కనిరోడ్డునిర్మించవలయును, పోష్టాఫీసు పెట్టించవలయును ఆసుపత్రినియేర్పాటుచేయవలయును ఇట్టిసదుపాయములుకలిగించినచో అనేకవేలమందిరైతులు సంతోషముతో నచ్చిరింది సేద్యముచేసుకొందురు-

ఈకాలములో రైతులుభూములులేకను పదుపాయములులేక నరిపోలములుదొరకకను దరిద్రదేవతకుదాసులై బాధపడుచున్నారు. ఈమహాకార్యమునకు శ్రీ౹౹శ్రీ౹౹ సంస్థానమువారు పూనుకొనినచో "కడుపునిండంగ భిక్షపెట్టుటకు పెట్టె" ననుకీర్తికి పాత్రులగుదురని చెప్పవలయును-

ఇట్లు

బూర్గంపాడు } ఇంద్రకంటి వెంకట

౨౫మార్చి౧౯౪౧ } రమణమూర్తి

---

సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

**Golkonda Patrika**

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions
Best Medium
for
ertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

*Volume* **15** **Hyderabad-Dn** **Monday 7 th April 1941** *Number* **92**


# బ్రిటిషు పార్లమెంటులో మరల పాతమాటే

## పార్లమెంటులో ప్రశ్నలకు అమెరీగారి జవాబు

లండను, ఏప్రిలు ౨:

భారత జాతీయప్రభుత్వంలో భారతీయులు సభ్యులుగావుండువల్ల బ్రిటనుకును ఇండియాకును చాల మేలుకలుగునను అభిప్రాయము యిప్పుడు ఇండియాలో ప్రజలకు చాలఅధికముగావున్నది, అధికమైనపలుకుబడికలవారు చాలనుంది యీ అభిప్రాయమునే వెల్లడించుచున్నారు, వీరిసంఖ్య రోజురోజుకు చాలాఅధికమగుచున్నది ఈఅభిప్రాయమును వెల్లడించుచున్నవారిని ప్రోత్సాహపరచి వారిసహాకారమును పూర్తిగా వుపయోగించుకొని యీరెండుదేశాలకు నిజమైనలాభములు గునట్లుచేయుటలో ఇండియాప్రభుత్వమువారేమి యేర్పాటులనుచేయుదు?" అని నేడుపార్లమెంటు కామన్సుసభలో గ్రాహంగారడిగిరి.

ఈప్రశ్నకుఇండియామంత్రి అమెరిగారిట్లు జవాబుచెప్పిరి. "౧౯౪౦ అగష్టులో బ్రిటిషుప్రభుత్వమువారు చాలప్రయోజనకరములును కార్యానుకూలములునుఅయిన సూచనలనుచేసిరి. బ్రిటిషు ప్రభుత్వమువారు ఆసూచనలను రద్దుజేయలేరు. ఆసూచనలకు లోబడినట్టియు భారతరాజకీయాభివృద్ధికి నిరోధకములుగాయేర్పడిన యిబ్బందులను తొలగించుటకు సహాయములనితోచినట్టియు అన్ని సూచనలనుగురించవీ బ్రిటిషుప్రభుత్వమువారును, రాజప్రతినిధియు సానుభూతితోనే ఆలోచించుతారుఅని నేనిదివరకే స్పష్టముగాచెప్పినాను. ఇండియాలోరాజకీయపక్షాలవారు మిక్కిలి హెచ్చునంది యీసూచనలనామోదించవలెను. అన్ని రాజకీయపక్షాలకు పరస్పరాంగీకారము కూడ గలుగవలెను. అదియిప్పుడుకలుగ లేకనిచెప్పవలసి వచ్చినందుకు నేను చాలవిచారించుచున్నాను. ఇామనకందరికిని మిక్కిలిసంతాపకరమైనవిషయము, ఇండియాలోని రాజకీయనాయకులలో మిక్కిలి హెచ్చుమంది బ్రిటిషు ప్రభుత్వమువారు వెనుకచేసినసూచనలను ఆమోదింతురని,యిప్పుడు వెలువడినక్రొత్తసూచనలవలన విదితమైనచో ఆచరణసాధ్యములైన యేర్పాటులనుచేయుటకు సైప్రాయి వెనుదీయుడని యీసభవారు నమ్మివుండవచ్చును.

— —

# ఇటలీనావలకు కాపలా

## అమెరికా ప్రభుత్వ చర్య

### ద్రోహముజరుగకుండ ప్రతిక్రియలు

వాషింగ్టను, మార్చి30

27 ఇటాలియనావలలో అమెరికాప్రభుత్వమువారు కాపలాపెట్టి యున్నారు, ఈఓడలలో నావికులుగానున్న వారు ఓడయందలియంత్రములు మున్నగువానిని నాశము చేయకుండచేయుటకు యిట్లు చేయబడినది. ఈఓడలు అమెరికావారిచే పట్టుకొనబడలేదు. నష్టముకలుగ కేయకుండా చేయుటకు మాత్రమేకాపలాయుంచబడినది, అమెరికాలోనున్న ఇటలీనావలన్నిటిని ప్రవేశించికాపలా కాయవలెనని ట్రెజరీ సెక్రెటరీమార్గెంథాగారు ఉత్తరవుచేసినట్లువార్తవచ్చినది.

జర్మనునావకు కాపలా

బోస్టన్ హార్బరులోని జర్మనునూసెనావ లోనికి ఆయుధపాణులగు రక్షకభటులుప్రవేశించిరట పోర్టుచాయందలి విక్టర్ గ్లడ్సు రేవులోఆర్గనా అనుజర్మనునావనుకూడ కాపలాయుంచబడెను. ఈనావలలోచాలనష్టముకలిగించబడెనని ట్రెజరీ సహాయకార్యదర్శి హార్బర్టుగాస్టనుగారు చెప్పిరి. నష్టముకలిగినట్లు తెలియవచ్చుటచేత రక్షణకుగానుయిట్టిచర్య గైకొనబడెననిఆయనచెప్పెను రూజువెల్టు ఈచర్యనంగీకరించెనని ఆయనచెప్పెను, ఇటలీనావికులను ఆదేపనిగానావలలోనియంత్రములను చెడగొట్టుచుండిరి.

— —

# బ్రిటిష్‌జలాంతర్గామి సాహసము

## రెండు ఇటలీనావలను ముంచినకథ

అలెగ్జాండ్రియా, మార్చి30

ఇటలీసమీపమున కొన్ని ఇటాలియనునావలు సరుకులతో వెళ్లుచుండెను, వీనికి600 గజములదూరమున ఇటలీయుద్ధనావరక్షణార్థమువచ్చుచుండెను. ఇటలీయుద్ధనావను లక్ష్యముచేయక బ్రిటిష్ జలాంతర్గామి టార్పెడోలనుప్రయోగించి రెండు నావలపైదెబ్బతీసెను. బ్రిటిష్‌జలాంతర్గామిని ఆరుగంటలవరకు శత్రువులు వేటాడిరి కానిఅదిదొరకలేదు, ఇంతవరకు ఒక్కటియైనను, మూడువ్యాపారనావలను, ఒకజలాంతర్గామినిముంచెను.

— —

# డక్కాలో ఇంకను అల్లరులు

## కత్తులతో పొడుచుట

డక్కా, ఏప్రిలు ౨:

నేటిసాయంత్రంలోగా అక్కడక్కడ ౭గురిని కత్తులతోపొడిచినట్లు తెలుపబడెను. పూర్వబజారులో కత్తిపోటుగాయాలుపొందిన ౭గురిలో యిద్దరు చనిపోయిరి. బంగ్లాబజారులో మరిముగ్గురు పొడువబడిరి. అనంతరంపోలీసులు పూర్వబజారులో ఆసేనులనుఅరెస్టుచేసిరి.

జిల్లామేజస్ట్రేటు నేటిమధ్యాహ్నం హిందువుల ముస్లిములనాయకులను: పూర్వబజారుయందే అయిదవవార్డు శాంతిసంఘసభ్యులను కలిసికొని వారలుయింకాశ్రద్ధతో శాంతిస్థాపనకై యత్నించవలెననికోరిరి శాంతిసంఘసభ్యులతో కలిసినవారు పూర్వబజారు ప్రాంతమునకు వెళ్లిచూచిరి.

బెంగాలు వివిధపార్టీలసభ

గవర్నరుగారిచే సమావేశపరుపబడిన బెంగాలు శాసనసభలలోని వివిధపక్షాలసభ నేటి ఉదయం ప్రభుత్వభవనమునకూడి బెంగాలులో ప్రస్తుతరాజకీయస్థితినిగూర్చి ముఖ్యముగా సాంఘికకలహాలసమస్యను చర్చించెను. గవర్నరుగారు అధ్యక్షతవహించిరి. దాదాపు రెండుగంటలసేపు చర్చజరిగినమీదట సభ సోమవారంవరకు వాయిదా వేయబడెను.

—

# బెంఘాజిలోనుంచి బ్రిటిషుసేనలతొలగింపు

ఆఫ్రికాలో ఇప్పుడుజరుగుచున్న యుద్ధంలో బెంఘాజిమీదికి జర్మనుసేనలున్ను ఇటాలియనుసేనలున్ను అనేకములు అనేకమువైనమరఫిరంగులతో పైపడుచుండుటచేఅక్కడినుండి బ్రిటిషుసేనలుతొలగించబడినట్లున్నవి మళ్లీయుంచినయెడలమూచుకొని దానినితిరిగిపట్టుకొనే యత్నంచేయుదుమనియు బ్రిటిషువారు ప్రకటించివారు

— —

మొదటిపేజీ తరువాయి

వస్తువులపై బ్రిటీషువిమానాలు బాంబులనువేసినవి. టెపెలిన్ప్రాంతంలో ఆనిగమ్మతిరిగివచ్చినవి మార్చి౩౧వతేదీన అవి అల్బేనియాలో ఒకచోనుండి గ్రీసువైపుగోడ్డుపై పోవుచుండిన ఇటాలీయుల మోటారులపైనను, సేనలపైనను బాంబులను వేసినవి.

బాల్కనుప్రాంతంలో యుద్ధమేదీ సంభవించకుండాచేయుటకు తగినజాగ్రత్తలనుగూర్చిగ్రీసు ప్రభుత్వంతో చర్చించుటకై బ్రిటిషుప్రభుత్వవిదేశాంగమంత్రియగు ఆంథోనీఈడన్‌గారు, బ్రిటిషు సామ్రాజ్యసైనికాధికారుల ప్రధానకార్యాలయమునొక్క అధిపతి సర్ జాన్‌డిల్ గారితో గూడ మార్చి౩౧వతేదీన గ్రీసు ప్రధాననగరమగు ఏథెన్సు కుచేరి గ్రీసుప్రభుత్వంతో సంభాషించిరి. ఏప్రిలు ౧వతేదీన ఈడన్ గారు గ్రీసురాజుగారితోసంభాషించిరి. ఏప్రిలు౧వ తేదీన ఈడన్‌గారు గ్రీసు రాజుగారితో సంభాషించిరి. ఈడన్‌గారును డిల్‌గారును యుగోస్లావియా ప్రధాననగరమగు బెల్గ్రేడుకు గూడ పోయెదరని కొందరనుచున్నారు.

బ్రిటను, జర్మనీలయుద్ధము

౧౯౪౧ జనవరినుండి మార్చినెల ఆఖరువరకును బ్రిటనుపైకి దాడిచేయుటకు వచ్చిన జర్మనువిమానాలలో ౧౪౦౫ బ్రిటిషువారిచే నాశముచేయబడినవి. అనగా సెలకుసగటున నాశముచేయబడినవనిఅర్థము.

ఇక మార్చినెల ౩౧వ తేదినుండి ఏప్రిలు౪వతేది వరకుజరిగిన జర్మనువిమానాలదాడులనుచూతము. మార్చి౩౧వతేదీపగలు ఒకజర్మనువిమానము ఇంగ్లీషుఛానల్‌మీదికిరాగా అదిక్రిందికి కూల్చబడెను. ఆనాటిరాత్రి లండనుపైమాత్రము దాడిలేదేగాని బ్రిటనులోని తక్కినప్రదేశాలపై అక్కడక్కడ బాంబులువేయబడినవి. ఈశాన్యప్రాంతసముద్రతీరమందలి ఒకపట్టణముపై తీవ్రమైనదాడి జరుగుటచే చాలగొప్పనష్టమయ్యెను. అనేకులకు గాయములైనవి. తక్కిన చోట్లలో దాడులవల్ల కొద్దినష్టముమాత్రమే కలిగెను. ఏప్రిలు ౧వతేది పగలు దక్షిణఇంగ్లాండుతీరమునందు కొద్దినష్టము కలిగెను, కొందరుమరణించిరి రెండు జర్మను విమానాలు క్రిందకూల్చబడెను. వేల్సు కెదురుగా ఉండేసముద్రంలో రెండుశత్రువిమానాలు నాశముచేయబడెను. నాటిరాత్రిబ్రిటనులో నైఋతిప్రాంతమందు సాయంకాలము కొద్దిగా బాంబులుపడుటతప్ప మరేమియుఎక్కువనష్టములేదు. మొత్తముపై ఏప్రిలు౧వతేదినాడంతయు ౫ జర్మనువిమానములు బ్రిటనుపైకివచ్చినపుడు నాశము చేయబడినవి. ఏప్రిలు౨వతేది ఉదయం ఇంగ్లీషు ఛానలుపై ఒక జర్మనుబాంబరు కూల్చివేయబడెను-౨వతేదీరాత్రి లండనుపైదాడియేలేదు. తక్కినచోట్లలో నైఋతిఇంగ్లాండుపై కొద్దిబాంబులు వేయబడెను ఈస్టుఆంగ్లియాలో ఒకచోటను, స్కాట్లెండుఈశాన్యభాగంలో ఒక పల్లెపైనను బాంబులు వేయబడుటచే కొంతనష్టము జరిగినది. తక్కినచోట్లలో చాలకొద్దినష్టము. ౨వతేదీఉదయం ఒకజర్మనువిమానము క్రింద కూల్చబడెను.

ఇదివరకు బ్రహ్మాండమైన దాడిదెబ్బతిన్న బ్రిస్టల్‌నగరములో ఇప్పుడు పనులు ఎప్పటివలెనే చేసికొనుచున్నారు. ధీరతకిది నిదర్శనము. ప్లయిడుసైడులో మార్చి౧౩వ,౧౪వతేదులలో జరిగినదాడులచే ౧౧౦౦ మందిచచ్చిరి. ౧౦౦౦మంది ప్రాణాపాయము చేయజాలినంతటి గాయము అనుభవించిరి.

ఏప్రిలు౩వ తేదిన బ్రిటిషుసముద్రతీరప్రదేశాలయందు జర్మనువిమానాలు కొద్దిగాతిరిగినవి, కాని బ్రిటనులోపలికిచాలా కొద్దివిమానాలుపోయినవి నష్టముచాలస్వల్పము ఒకజర్మనువిమానము సముద్రంలోకికూల్చబడెను బ్రిటీషువిమాన మొకటి కనిపించకుండాపోయినది. ౩వతేదిచాలరాత్రివరకు లండనుపై జర్మనువిమానాల దాడులులేవు. లేదు. కానిఆగ్నేయప్రాంతము. పశ్చిమప్రాంతము మున్నగు ఇతర ప్రాంతాలపై చీకటిపడగానే జర్మనువిమానాలుతిరిగినవి. పశ్చిమఇంగ్లాండులో ఒకపట్టణముపై నాలుగుగంటలసేపు బాంబులువేయబడగా కొంతనష్టముకలిగెను. ఒకజర్మను విమానమునాశనముచేయబడెను. లండనుపైకి రెండు సారులు శత్రువిమానాలు వచ్చిపోయెను.

ఇకజర్మనీపై బ్రిటిషువిమానాల దాడులనుగురించితెలుసుకొందము- మార్చి౩౧వ తేది మధ్యాహ్నానంతరము బ్రిటిషువిమానాలు ఇంగ్లీషుఛానలమీదను ఫ్రాన్సులో జర్మనులాక్రమించియున్న సముద్రతీరపు రేవులమీదను తిరిగిబాంబులనువేసినవి. బోర్డియోలో రెండు జర్మనుయుద్ధనౌకలు తలదాచుకొనియున్నట్లుతెలిసి ఆరేవుపైబాంబులను మార్చి౩౧వ తేదిరాత్రి బ్రిటిషువిమానాలువేసినవి. కలేరేవుపైనకూడ ౩౧వ తేదిరాత్రి బాంబులువేయబడినవి. ౩౧వ తేదిరాత్రి జర్మనీలోని బ్రెమెన్‌పైనను, లండనుమీదను బాంబులువేయబడినవి. లండన్‌లో ఉపయోగించినట్టిది ఇంతవరకు వాడుచుండినరకముకాక క్రొత్తరకపుబాంబు ఈబాంబులదెబ్బలకు క్రిందిభవనాలుపగిలి ఒక్కపెట్టున పైకెగసిక్రిందపడినవి. అందువల్లనష్టము చాలఎక్కువకలిగినది. జర్మనీ వాయవ్యభాగంలో రెండుచోట్లను, రోటర్‌డాంలో పెట్రోలుదించు రేవుమీదను, ఆరేవుకుదగ్గఱలోనుండు రెండువిమానాశ్రయాలమీదను బాంబులువేయబడినవి, ఫ్రిజియనుదీవులలోఉండిన ఒకజర్మనుడిస్ట్రాయరు నౌక రెండుమారులు దెబ్బలుతినినది మరిరెండుదీవులలో జర్మనుసేనలు కవాతుచేయుచుండగావాటిపై బ్రిటిషువిమానాలనుండి బాంబులుపడినవి. ఆకవాతు మానుకొనబడినది. శత్రువుకు సామగ్రి గొనిపోవుచుండిన ఒకనౌకపై బ్రిటిషువారు బాంబులనువేసిరి- తర్వాతరోజుల సమాచారములు తెలియరాలేదు-

— —

# గ్రీసుపై జర్మనుల దాడి

ఇదివ్రాయుచుండ ఏప్రిలు౬వతేది ఉదయం ౫౪౫ గంటలకే గ్రీసులోని జర్మను రాయబారి గ్రీసుప్రధానితో జర్మనుసేనలు గ్రీసుపైకి దండెత్తివచ్చుచున్నవని తెలిపెను. తర్వాత గ్రీసులోని త్రేసు సరిహద్దువద్దను, తూర్పుమాసిడోనియా సరిహద్దు వద్దను జర్మనుసేనలు గ్రీసుసేనలపై యుద్ధానికి దిగినవి.

—




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn, Editor- S Prathapa Reddy B, A B.L.,